సంగీత నృత్యాభినయానుకూల

# కృతులు
# పదములు - జావళీలు



మహాకవి శ్రీ దాసు శ్రీరాములు



**మహాకవి దాసు శ్రీరాములు గారు**

**(ఏప్రియల్ 8, 1846 - మే 16, 1908)**



**శ్రీమతి దాసు జానకమ్మ గారు**

శ్రీ దాసు శ్రీరాములు గారి సతీమణి

**(1853 - 1927)**

సంగీత నృత్యాభినయానుకూల

# కృతులు

# పదములు - జావళీలు

మహాకవి

## శ్రీదాసు శ్రీరాములు

మహాకవి దాసు శ్రీరాములు స్మారకసమితి

హైదరాబాద్

*Kruthulu - Padamulu - Jaavaleelu*
by *Mahakavi*
**Sri Dasu Sriramulu**

**సంగీత నృత్యాభినయానుకూల**

# కృతులు-పదములు - జావళీలు

**మహాకవి**

# శ్రీదాసు శ్రీరాములు

ప్రథమ ముద్రణ : 2007

ప్రతులు : 500

వెల : **రూ. 300/-**

**ప్రతులకు :**

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
అబిడ్స్, హైదరాబాద్.
**విశాలాంధ్ర బుక్‌హౌస్** (అన్ని బ్రాంచిలలో)


ఫ్లాట్ నెం. 201 శ్రీ సాయిరామ్ ఆదిత్యా రెసిడెన్సీ,
ఇంజనీర్స్ కాలనీ, ఎల్లారెడ్డిగూడ,
హైదరాబాద్ - 500 073.
ఫోన్ : 040-23734864
email : araodasu@gmail.com

ముఖచిత్రం :
**శ్రీ గోలి శివరాం**

**డి.టి.పి.**
**సమంత గ్రాఫిక్స్**
ఎస్.ఆర్.టి. 208,
జవహర్ నగర్, హైదరాబాద్ - 80.
ఫోన్ : 27670198

ముద్రణ :
**శ్రీ కళాప్రింటర్స్**
1-1-786/సి/1,
గాంధీనగర్, హైదరాబాద్ - 20
ఫోన్ : 27611864

# నివేదన

మహాకవి దాసు శ్రీరాములు గారు క్రీ.శ.19వ శతాబ్ది ఉత్తరార్థమున (1846-1908) తెలుగు దేశమున జన్మించి, ఆంధ్ర సాహిత్యమును తమ అమూల్యమైన రచనలతో అలంకరించి అలరించిన మహామనీషి. ప్రబంధములు, పురాణములు, నాటకములు, శతకములు, శాస్త్రగ్రంథములు, కృతులు, పదములు, జావళీలు మొదలగు ఎన్నో ప్రక్రియలలో ముప్పదికి పైగా గ్రంథ రచనలు గావించియున్నారు. "ఆయన గొప్ప పండితుడు, గొప్ప కవియు మాత్రమే గాక, గొప్ప న్యాయవాది, గొప్పసంఘ సంస్కర్త, గొప్ప దేశాభిమాని. ఆయన జీవితకాలంలో ఆంధ్రదేశ సాంఘిక, సాంస్కృతిక, మత, రాజకీయాభివృద్ధికి పాటుపడిన మహాపురుషులలో నొకరు. ఆంధ్రదేశ ప్రజలకు, ఆంధ్ర భాషకు ఆయన చేసిన సేవ అసమానము", అని ప్రముఖ న్యాయవాది, చరిత్రకారులు కీ။శే။ దిగవల్లి వేంకట శివరావుగారు వ్రాశారు. "ఇటీవల ననగా, ఆంగ్ల ప్రభుత్వమారంభమైన పిమ్మట నుద్భవించిన కవులలో, నందు నించు మించు మా సమకాలికులగు కవులలో ప్రాచీన సాంప్రదాయముగా గవితా సామాగ్రి సేకరించి రచనకు కడంగువారు వీరు దక్క లేరు. కవులుండవచ్చును, పండితులుండవచ్చును, ఐశ్వర్యవంతులుండవచ్చును, కాని దాసు శ్రీరామకవి వంటి ధన్యులు కోటి కొకరేని చేకూరుట యరుదు. శ్రీ రామ కవిచంద్రుని నేను రెండవ శ్రీనాథునిగా నామనసున అనుకొందును. ఈయన సరస కవి, విద్వత్కవి, ఆశుకవి, దాత, నేత. ఇన్ని యోగాలు పట్టినవారు ఏకకాలంలో మృగ్యులే. ఇన్ని అదృష్టములు సంఘటించిన కవి లేనే లేదు" అని బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రిగారు 'శ్రీదేవీ భాగవతము' ఉపోద్ఘాతములో వ్రాసారు.

అంతటి మహాపురుషుని వంశమున జన్మించి, వారియశో సంపదకు వారసుల మందరము కలసి వారి రచనలను పునర్ముద్రించి సాహితీ లోకమునకందించవలెనను సంకల్పముతో **'మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి'** ని 1973వ సంవత్సరములో స్థాపించితిమి. ఇంతవరకు 'తెలుగునాడు', 'అభినవగద్యప్రబంధము', 'శ్రీదేవీభాగవతము', 'సూర్యశతకము', 'కురంగ గౌరీ శంకర నాటిక', 'చక్కట్లదండ' అను అచ్చ తెలుగులో నీతిశతకము, 'భృంగరాజమహిమ, శ్రాద్ధ సంశయవిచ్ఛేది', 'దురాచార పిశాచ భంజని', 'ఆచార నిరుక్తి, విగ్రహారాధన తారావళి', 'జావళీలు - పదములు' అను గ్రంథములను ప్రచురించితిమి. శ్రీరాములు గారి 'జయంతి సంచిక'ను 1975లో 'ప్రపంచ తెలుగు మహాసభ'లలో కవి సామ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణ గారు ఆవిష్కరించిరి. శ్రీరాములు గారి మునిమనుమరాలు డా॥ శ్రీమతి వెలగపూడి వైదేహి గారు 'మహాకవి దాసు శ్రీరాములు గారి కృతులు - ఒక సమీక్ష' యను సిద్ధాంత గ్రంథమును ఆంధ్ర విశ్వకళా పరిషత్తుకు సమర్పించి పి.హెచ్.డి. పొందిన తర్వాత దానిని ప్రచురించిరి.

శ్రీరాములు గారు మహాకవియేగాక మహావాగ్గేయ కారులు. వీరు ఎన్నో కృతులు, పదములు జావళీలు రచించి సంగీత సాహిత్యమునకు ఎనలేని సేవ చేసినారు. "ఏలూరులో సబార్డినేటు కోర్టులో ఫస్టు గ్రేడు ప్లీడరుగా నుండు కాలమున రాజా బొమ్మదేవర నరసింహనాయుడు గారి వలన ప్రేరేపింపబడి 'సర్వజిత్' సంవత్సర చైత్రశుద్ధ ప్రతిపత్తు మొదలు మార్గశీర్ష బహుళ అమావాస్య వరకు రచించిన భగవన్నామ పఠనానుకూల కృతులును, శ్రీ కృష్ణ లీలా ప్రతిపాదకములగు పదములు, మొదలగునవి గల "చిన్ని పుస్తకము" గాన విద్యావినోద రసిక జనానందకరముగ

*నుందు నటుల వ్రాసితిని" అని దీని ఆముఖమున వ్రాసిరి. ఈ రచనను వారు 1887 డిశెంబరు 20వ తేదీన పూర్తి చేసిరి.*

శ్రీరాములు గారు గానవిద్యను ఉద్ధరించుటకు, గాయకులను ప్రోత్సహించుటకు ఏలూరులో నొక సంగీత పాఠశాలను స్థాపించిరి. ఏలూరులో నున్నంత కాలము విద్యాగోష్ఠులు, సంగీత సభలు సతతము వారింట జరుగు చుండెడివి. సంగీత శాస్త్రమునందు అభిరుచియేగాక భరత శాస్త్రమునందునూ వీరికి ప్రావీణ్యము కలదు. అభినయించి చూపగలసమర్థులు. "అభినయ దర్పణము" అను గ్రంథమును కూడా రచించిరి.

ఈ మహా వాగ్గేయకారుని కృతులు, పదములు, జావళీలను సేకరించి మాకందించిన మా సమితి తొలి అధ్యక్షులు కీ॥శే॥ దాసు పద్మనాభరావు గారికి మా కృతజ్ఞతాభివందనములు. 'కృతులు, పదములు, జావళీలు' స్వరములతో సహా ప్రచురించాలను మాసంకల్పమును ప్రోత్సహించి కోరిన వెంటనే జావళీలు, పదములలో కొన్నిటిని కీ॥శే॥ శ్రీవోలేటి వేంకటేశ్వర్లు గారూ, మిగిలినవి కీ॥శే॥ శ్రీనల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారూ స్వరపరిచి, 1987 సంవత్సరంలో మాకు అందచేసిరి. అనివార్యకారణాల వలన వాటిని వెంటనే ముద్రించ లేకపోయినాము. 1991 సెప్టెంబరులో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, దక్షిణ ప్రాంత సాంస్కృతిక కేంద్రం, తంజావూరు, సంయుక్త ఆధ్వర్యంలో నిర్వహించిన వాగ్గేయకార ఉత్సవాలను పురస్కరించుకొని కవిగారి సాహిత్యముతో మాత్రమే ముద్రించిన *'జావళీలు – పదములు'* పుస్తకమును పద్మభూషణ్, సంగీత కళానిధి డా॥శ్రీపాద పినాకపాణిగారు ఆవిష్కరించారు. తదుపరి వారి ఇతర కృతులు, స్వరజతులు, తిల్లానా, మంగళ హారతులను మహామహోపాధ్యాయ శ్రీ నూకల చిన్న సత్యనారాయణ గారు స్వరపరిచి ఇచ్చినారు. వారికి మా కృతజ్ఞతలు. వీటన్నిటినీ కూర్చి స్వర సహితంగా ముద్రించి సంగీత, సాహిత్య ప్రియులకు అందించ గలుగుతున్నందుకు మాకు చాలా ఆనందముగా నున్నది. సంగీత పరమైన ఈ పుస్తకము కూర్పు, ముద్రణ ఎంతో శ్రమతో కూడినవి. ఈ ప్రయత్నంలో మాకు ఎంతో మంది సహకరించినారు. ముఖ్యంగా పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలోని సంగీత విభాగంలో అధ్యాపకురాలు శ్రీమతి పద్మా రామలింగశాస్త్రి గారు, ప్రూఫ్ సరిచూడటమే కాక స్వర, తాళ, లయ పరముగా కూడ సరిచూచి, ముద్రణాప్రతి స్థాయివరకు తీసుకువచ్చుటలో ఎంతో సహాయము చేసినారు. వారికి మా హృదయ పూర్వక ధన్యవాదములు. ఎంతో ఓపికతో డి.టి.పి. అక్షరాలంకరణ చేసిన *శ్రీ దత్తసాయి* గ్రాఫిక్స్ మరియు సమంతా గ్రాఫిక్స్ వారికి మా అభినందనలు.

శ్రీరాములు గారు ఈ సంగీత రచనలు ప్రధానంగా అభినయ ప్రదర్శనానుకూలపరంగా చేసినారు. వాటిని ఆనాటి దేవదాసీ కళాకారులు వారి దగ్గర నేర్చుకొని అద్భుతంగా నాట్యం చేసెడివారు. మరుగునపడిపోతున్న ఈ నృత్యకళను మరల వెలుగులోకి తెచ్చుటకు కృషి చేస్తున్న వారిలో ముఖ్యులైన ప్రసిద్ధ నర్తకీమణి పద్మభూషణ్ శ్రీమతి స్వప్నసుందరి గారు ఈ దృక్కోణంలో పరిశీలించారు. మాకు అమూల్యమైన సలహాలిస్తూ ప్రోత్సహించారు. వారికి మా ధన్యవాదములు. వారు వ్రాసిన ఆంగ్ల వ్యాసాన్ని పొందుపరిచాము. ప్రముఖ పాత్రికేయులు శ్రీ దాసు కృష్ణమూర్తి

గారు ఆంగ్లంలో క్లుప్తంగా వ్రాసిన శ్రీరాములు గారి జీవిత సారాంశం (వెనుక అట్ట మీద) మరియు డా॥ దివాకర్ల వెంకటావధాని గారు వ్రాసిన 'శ్రీరాములు పంతులు గారి జీవిత సంగ్రహము - రచనలు' కూడ ఈ పుస్తకములో పొందుపరచబడినవి.

ఈ బృహత్కార్యములన్నియూ సఫలీకృతమగుటకు నా ఆరాధ్యదైవము భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయి బాబావారి అనుగ్రహ ఆశీర్వచనములున్నవి. స్వామి సంగీత, సాహిత్యప్రియులు. ఇంతకుముందు ముద్రించిన 'శ్రీదేవీ భాగవతము', 'సూర్య శతకము'లను స్వామి స్వహస్తములతో ఆశీర్వదించిరి. ప్రస్తుత స్వర సహిత కృతులు, జావళీలు - పదముల ప్రతిని ప్రశాంతినిలయ ప్రాంగణములో 2002 ఫిబ్రవరి 10న స్వామి తమ దివ్య హస్తములతో ఆశీర్వదించినారు. స్వామి దివ్యపాదరవిందములకు నా శతకోటి ప్రణామములు.

సమితి స్థాపించినది మొదలు, కార్యక్రమములను రూపొందించుటలోనూ, నిర్వహణలోనూ, మాకు దిశ నిర్దేశములో స్ఫూర్తినిచ్చిన పూర్వ అధ్యక్షులు (కవిగారి మనుమలు) కీ॥ శే॥ శ్రీదాసు పద్మనాభరావు, శ్రీదాసు శ్రీరాములు మరియు శ్రీదాసు వాసుదేవరావుగార్లకు మా కృతజ్ఞతాభివందన నివాళులు. సమితి స్థాపన మొదలు సంయుక్త కార్యదర్శిగా అన్ని కార్యక్రమములలో బాధ్యతలు నిర్వహించిన శ్రీదాసు దామోదర రావుగారికి మరియు ఈ పుస్తక ప్రచురణలో నన్ను ప్రోత్సహిస్తూ, నాకు అండగా నిలిచిన శ్రీ దాసు గోవిందరావు గారికి నా కృతజ్ఞతలు.

సమితి కార్యక్రమములలో పాల్గొనుట తమ పవిత్ర ధర్మముగా, బాధ్యతగా గుర్తించి దాసు వంశీయులు, సోదర సోదరీమణులు మరియు వారసులు హార్థిక, ఆర్థిక ప్రోత్సాహము ఇస్తూ సమితి పురోభివృద్ధికి తోడ్పడుచున్నారు. వీరందరికి హృదయ పూర్వక అభినందనలు.

ఈ మహాకవిపుంగవుని అనేక రచనలలో కేవలం కొన్ని మాత్రమే పునర్ముద్రింపబడినవి. ముద్రించవలసినవి ఇంకనూ ఎన్నియో ఉన్నవి. వాటి ప్రచురణయే గాక, వారి స్మృతి చిరస్థాయిగా నుండుటకు కార్యక్రమములు చేపట్టవలసిన ఆవశ్యకత ఎంతో ఉన్నది. ఈ కార్యక్రమములలో ఉత్సాహంగా పాల్గొన వలసినదిగా దేశ, విదేశాలలో ఉన్న తరతరాల దాసు వంశీయులను, వారసులను, అభిమానులను ఆహ్వానిస్తున్నాము.

**20-3-2007**
**సర్వజిత్ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి**

ఇట్లు
భవదీయుడు
**డా॥ దాసు అచ్యుతరావు**
గౌరవ కార్యదర్శి,
మహాకవి దాసు శ్రీరాములు స్మారకసమితి
హైదరాబాద్.

# వాగ్గేయకార ప్రశంస

**శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు** విజయవాడ, 27-2-1987

కీ॥శే॥ శ్రీ దాసు శ్రీరాములుగారి పేరు నాకు చిరపరిచితమే. వారు చాలా గొప్ప పండితులు, సరసకవులేకాక, సంగీత రచనల యందును చక్కని భావుకత కలవారు. వారి 'చక్కట్లదండ', 'తెలుగు నాదు', 'శాకుంతలము' మొదలయిన గ్రంథములు వారి పాండితీ ప్రకర్షకు నికషోపలములు. ఇవికాక 'లక్షణా పరిణయము' అను యక్షగానము నవరసభరితముగా నుండును.

వారు మంచి గేయకర్తలుగా నా పితామహులు చౌదిమెళ్ళ వాస్తవ్యులయిన కీ॥శే॥ నల్లాన్ చక్రవర్తుల తిరువేంగళచార్యులు గారు మొదలయిన వారి వలన నా చిన్నతనంలోనే నేను వినియున్నాను. తరువాత శ్రీరాములు గారి రచన అయిన 'గణనాయకం' అను కళ్యాణికృతి కొంతమంది సంగీత విద్వాంసులుపాడగా నాకెరుక. ప్రసిద్ధ సంగీత విద్వాంసులగు శ్రీ యం.ఎస్. సుబ్రహ్మణ్య శర్మ గారు నలుబది సంవత్సరముల క్రితమే పాడగా నేను విన్నాను.

శ్రీరాములు గారి మనుమలగు శ్రీ దాసు పద్మనాభరావు గారు శ్రీరాములు గారు రచించిన జావళీలకు, పదములకు స్వరములు కూర్చుటకు సుమారు మూడు సంవత్సరముల క్రితం శ్రీ వోలేటి వేంకటేశ్వర్లు గారిని కోరిరి. వారు కొద్దిగా స్వరపరచి తక్కిన అన్నిటిని స్వరపరచు భారమును నాపై పెట్టుదని శ్రీ పద్మనాభరావు గారికి సూచించిరి. నేను శ్రీరామకవి వస్తువైలక్షణ్యమునుబట్టి ఆపనికంగీకరించితిని.

శ్రీరాములు గారి ఈ పదరచనములు ప్రతిపదరసోదయములు. అలంకార శాస్త్రమందలి నాయికా నాయక భావములు చక్కగా నీపదములలో ఒదిగింపబడినవి. ఈ పదములు క్షేత్రయ్య పదముల కోవలోని వనుటకు సంకోచము లేదు.

వాగ్గేయకారుడన్న చాలా పరిజ్ఞానములుండవలెను. గేయపరచుటకు అనువైన పరిశుద్ధ భాషాజ్ఞానము, ఛందోవిజ్ఞానము, రసభావముల నెరిగిన మెలకువ శ్రీరాములు గారి గేయకవనమందున్నవి. మీదు మిక్కిలి వారు దేవీ భాగవతాద్యనేక ప్రౌఢ కావ్యకర్తలు. ఈ గుణములచే నేను తక్కినవి స్వరపరచు బాధ్యతను చేపట్టాను.

ఈ పదములు, జావళీలలో సుమారు సగము శ్రీ వోలేటి వెకంటేశ్వర్లు గారు, సగము నేను స్వరపరచుట జరిగినది. అదియును గాక అచటనచట కొంత పరిష్కార భారము కూడ నాపై బడినది. వ్రాతప్రతిలో స్వల్ప స్థానములయందు పదలోపములను నాకు తోచినట్లు పూరించుట జరిగినది. అది శ్రీరాములుగారిది కాదు. వ్రాతలో జరిగినదే. ఇందు సాహిత్యమును బట్టి జావళీలు, పదములు విభజించుట చేసితిని. శ్రీరాములుగారికి కాపీ రాగమనిన చాలా ప్రియమని తోచును. కాపీ రాగ గేయముల యందు సాధ్యమైనంత వరకు వైవిధ్యము పాటించియే స్వరపరచుట జరిగినది. అన్నియును శ్రీరాములుగారు సూచించిన రాగ తాళములలోనే స్వరపరచుట జరిగినది. ఒకటి రెండు మాత్రము మార్చితిని.

నేను స్వరపరచుట కాని, పరిష్కరించుట కాని యతి ప్రాసాది లక్షణ నియమములతో జరిగినది. ఈ రచనలు కవితా పరముగా గాని, రసాలంకార పరముగా గాని మేలు రచనలు. నేను స్వరపరచుటలో కొన్నింటికి కొంతకాలపు వెనుక బాణీనూహించితిని. మేము స్వరపరచిన దాని ననుసరించి భావుకులగు గాయకులు సంగతులను కల్పించుకొనవచ్చును. అట్టి సులక్షణము రచనలయందున్నది. ఇందు మేళకర్త వరుసలో రాగ క్రమము పాటింపక వ్రాతప్రతిలో నున్న క్రమములోనే వ్రాయుట జరిగినది. శ్రీదాసు శ్రీరాములు గారి గేయములు స్వరపరచుట నేనొక భాగ్యమని భావించితిని. ఈ సత్కార్యమునకు నన్ను నియమించిన శ్రీ దాసు పద్మనాభరావుగారికి నేను కృతజ్ఞుడను.

తదుపరి ఈ రచనలను ప్రచారమునకు దెచ్చు విధి గాయకులది.

**నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు**

**మహామహోపాధ్యాయ**

**నూకల చిన్న సత్యనారాయణ** హైదరాబాద్, 29-11-2006

ఓం శ్రీం

మహాకవి, మహావాగ్గేయకారుడు, దానశీలుడు, సంఘ సంస్కర్త, మహాభక్తుడు, మహాజ్ఞాని మొదలైన ఎన్నో దివ్యమైన సుగుణములు కలిగి మనమధ్య దివ్యజ్ఞానయోగిగా జీవనము సల్పిన మహామనీషి, శ్రీదాసు శ్రీరాములు గారు.

వీరి సాహిత్యసేవ, కవిత్వ పటుత్వ సంపద వీరి ఇతర ఆదర్శగుణాలతో పాటుగా, వీరి మరియొక మహా సహజగుణ సంపద ఏమనగా వీరి మహా వాగ్గేయకార సంపద.

మన తెలుగు మహావాగ్గేయకారులు, త్యాగయ్య, శ్యామశాస్త్రి, క్షేత్రయ్య, అన్నమయ్య, భద్రాచల రామదాసు, మొదలైన కోవకి చెందిన వారు శ్రీదాసు శ్రీరాములుగారు. వీరు కృతులను, పదాలను, జావళీలను, తిల్లానాలనే కాక సంగీత విద్యాభ్యాసానికి చెందిన స్వరజతులను కూడా రచించడం విశేషం.

వీరు రచించిన పదం నా చిన్నతనంలోనే విని, నేర్చుకొని, నేను అనేక గాన సభలలో గానం చేయటం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఈ పదం 'వనితరో ఈ వన్నె లేలనే' ఆనందభైరవి రాగం, రూపకతాళం.

నా భాగ్యం, అదృష్టం కారణంగా నాకు శ్రీదాసు వారు రచించిన దైవస్తోత్ర కీర్తనలు వారు నిర్దేశించిన రాగాలలోనే స్వరపరచడం అనే పవిత్రమైన పనిని, శ్రీదాసు వారి మునిమనుమలైన డా॥ దాసు అచ్యుతరావు గారు కలుగజేసినారు. ఇది నా పూర్వపుణ్య విశేషం.

శ్రీవారి పదములు, జావళీలు మన ఉత్తమోత్తమ సంగీత విద్వాంసులు, పండితులు అయిన శ్రీ వోలేటి వేంకటేశ్వర్లు గారు, శ్రీ నల్లాన్ చక్రవర్తులు కృష్ణమాచార్యులు గారు అద్భుతంగాను, ఆదర్శప్రాయంగాను స్వరపరచారు.

ఈ నా స్వరరచనా పవిత్ర సేవ్యంలో నాతో పాటే చి॥సౌ॥ పద్మారామలింగశాస్త్రి కూడా విశేషంగా కృషి చేసేరు.

శ్రీదాసు శ్రీరాములు గారు చిరంజీవులు, శ్రీవారు వాగ్గేయకారులుగా సూర్యచంద్రులు ఉన్నంతవరకు ప్రకాశిస్తోనే ఉంటారు. వారిని కన్న తెలుగుతల్లి ధన్యురాలు.

డాక్టర్ దాసు అచ్యుతరావు గారు వారి బంధువర్గం అందరూ శ్రీదాసు శ్రీరాముల వారి రచనా విశేషాలను దేశానికి అర్పించడంలో విశేష కృషిని చేసేరు, చేస్తున్నారు. వారిని తన రక్తబంధువులుగా, మనమలు, మునిమనమలుగా పొందడం అనేది శ్రీదాసు శ్రీరాములు గారి అదృష్టం అలాగే డాక్టర్ దాసు అచ్యుతరావు ప్రభృతులు శ్రీదాసు శ్రీరాములు గారిని మూలపురుషులుగా పొందడం వారి మహామహాభాగ్యం అదృష్టం.

మరియొకసారి నేను శ్రీదాసు శ్రీరాములు వారికి భక్తితో, నమ్రతతో మ్రొక్కుతున్నాను.

అలాగే శ్రీవారి వంశీయులకు, ముఖ్యంగా డాక్టర్ దాసు అచ్యుతరావు గారికి నా కృతజ్ఞతా వందనాలను సమర్పించు కొంటున్నాను.

ఇట్లు
బుధజనవిధేయుడు
**నూకల చిన్న సత్యనారాయణ**

# Mahakavi Dasu Sriramulu

## His contribution to dance poetry

***Padmabhushan* Smt. Swapnasundari*** **New Delhi,**

**5-2-2007**

The first time I heard Mahakavi Dasu Sriramulu's lyrics was when, as a child, I was learning Kuchipudi dance. During a lesson, I watched my guru teaching some of the older students *Thattara Padaneyla, thaalu thaalu ra saami.* It did not occur to me then to ask him who the composer was. Much later, as my interest in dance grew, I saw the Telugu *devadaasis* performing *Poyi vacheda saami.* With fascination, I watched them demonstrate various shades of emotions of a *parakeeyanaayika*, the protaganist in the charming lyrics of the song.

Both the songs were dedicated to Lord Venugopala and carried Sri Dasu Sriramulu's *makutam.*They whetted my eagerness to seek out other works of the Mahakavi . With the help of the late Dr.Arudra, I was able to lay my hands on most of his other songs.

It is not surprising that the bulk of Sri Dasu Sriramulu's songs was intended for performance, when one learns of his close associations with the zamindaars of Thotlavalluru and Nuzvidu. It is well-known that zamindaris supported large number of *devadaasi* danseuses. Moreover, Machilipatnam where the poet had lived for a part of his life, is not far from Kuchipudi village whose itinerant Bhaagavatham troupes used to seek inputs from musicians and poets. *Devadaasi* artists Chadalavada Rajaratnam, Pitchiah and Madhuram as well as Pinapala Bhavani are said to have drawn on these songs of Sri Dasu Sriramulu. Similarly, Kuchipudi actors like Vempati Kodandaramiah and Tadepalli Vissaiah also drew inspiration from Sriramulu's artistic repository.

It is a tribute to the great artists and gurus of both the *Devadaasi* tradition and the Kuchipudi tradition that their legacies have been preserved and perpetuated. That is why, today's dancer is an heir not only to a time-tested techniques but also an entire history comprising the complex processes that go into the evolution of a tradition. One of these processes is the close interaction between poets, dancers and actors. The Mahakavi's association with dancers of both genres led him to compose several *padams, jaavalis, swarajatis* and *yakshagaanams.*

Dasu Sriramulu is perhaps best remembered for his *padams* and *jaavalis*, although these were only a small part of his repertoire. Besides the two *padams* I cited at the beginning, there are several others which are written for *Abhinaya* presentation. Some of these are *Intamohamaa saami* in Darbar, *mukkupatchalaarani* in Yadukula Kambhoji, *maguva neynantha* in Todi. The first is a fine example of subtle sarcasm, and the second a frank expression of a naïve *mugdha naayika.* The third *padam* illustrates the nostalgic thoughts of a repentant *naayika.* For dancers who are comfortable with interpreting bolder poetic motifs, the padam *antha geervaanam* in Asaveri and *mootaladigithinaa*

---

* Vilasini Natyam and Kuchipudi Dance exponent.

in Yadukula Kambhoji illustrate the poet's ability to compose in a way that evokes a wide range of images.

Amongst the *jaavalis* of Dasu Sriramulu, *vaddu vaddura* in Pharaz has a format similar to other *parakeeya naayika* songs of the composer. Due to its brevity and simplicity, it could easily suit today's dance performance which are shorter than those of the earlier times. *Adavi mushnikaaya* in Mukhari is an amusing *jaavali* suited for a racy interpretation. My own favourite is *naanosataney* in Kamaas where the *naayika* draws the attention of her lover to the significance of passion in love, citing examples from couples in mythology. For sheer celebration of the joy of love *eymani thelupuduney* in Pharaz stands out. One could go on listing such examples.

Dasu Sriramulu's style reflects the flavour of his times both in terms of language and themes. Also his *jaavalis* and padams appeal with their simplicity and use of local expressions. These adapt well to *taala* and deal with the emotional states of both *parakeeya naayika* and *sweeya naayika*. It is no wonder that they have been popular over the decades.

Changed social mores and norms of present times make one wonder at the way traditional dances have managed to retain much of the supporting *saahitya* composed for a different day and age. It could be argued that human emotions are timeless and enduring and hence the older themes in dance *saahitya* remain alive even today.

Today we see that a number of people from diverse backgrounds study traditional dance styles. Many of them are deeply interested in the literary aspects related to dance and not just the performative aspect. It is possible for such persons to closely work in association with scholars and introduce new thematic background to traditional dance. One way of doing that is to identify and adapt hitherto unused material to dance. Here, the vast corpus of Mahakavi Dasu Sriramulu's works will be of great help. Today, dancers have the benefit of modern education and a penchant to create fresh choreographic works and find fresh avenues for research. There is every hope that beyond the known and familiar works, the great poetic legacy of Mahakavi Dasu Sriramulu would find expression in dance.

I consider it a great privilege to present my perception of Mahakavi Dasu Sriramulu's dance poetry, especially as my mother late Smt. Vakklanka Sarala's Guru Sri Voleti Venkateswarlu Garu has rendered many of them to tune. I am thus doubly honoured. I thank Dr. Dasu Atchuta Rao Garu for this woderful opportunity and wish the publication a success.

**Swapnasundari**

# మహాకవి దాసు శ్రీరాములు పంతులు గారి జీవిత సంగ్రహము - రచనలు

**- ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధాని**

దాసు వంశమునందలి పూర్వీకులలో నొకరయిన రఘునాధరావుగారు 1560 సంవత్సరము ప్రాంతమున ధార్వాడు నుంచి గోలకొండకు వచ్చినారట. వీరి కుమారుడు గంగోజీ (హరిదాస్) హైదరాబాదులో వుండి హరిభక్తుడగుటచే వీరికి దాసువారను నింటిపేరేర్పడెను. గంగోజీ ద్వితీయ కుమారుఁడైన రఘునాయకులు పోర్చుగీసువారిచే నేదో లౌకికోద్యోగమున నియమింపఁబడి (1640) బందరువచ్చి స్థిరపడిపోయెను. తదుపరి వారు నూజివీడు వచ్చి యచ్చటి నియోగి వంశములలో ప్రముఖమైన మెట్లపల్లివారి వంశముతో సంబంధము చేసి యచ్చటనే కీర్తిశేషులైరి. వారి కాలమునుండి దాసువా రాఱువేల నియోగులుగా పరిగణింపఁబడుచుండిరి. వారి కుమారులైన గంగరాజుగారు నూజివీటి ప్రభువులనుండి గురజ గ్రామమునకు చెంతనున్న యటవీస్థలమును గొంత సంపాదించి యచ్చట అల్లూరను గ్రామమును నిర్మించిరి.

రఘునాధరావు గారికి పదవతరము వారయిన కన్నయ్యగారికి, కామమ్మగారియందు 1846 వ సంవత్సరము ఏప్రిల్ 8 వ తేదీన శ్రీరాములుగారు జన్మించిరి. పూవుపుట్టఁగనే పరిమళించునన్నట్లు వారు బాల్యమునుండియు వినయ విధేయతలను విద్యాసక్తిని గల్గి వర్తించెడివారు. వారు అక్షరాభ్యాసమైన తరువాత 6 నెలలు కొఱ్ఱగుంటపాలెము నందుండిన అదవి సుబ్బారాయుడిగారి యొద్దను తరువాత తండ్రిగారి యొద్దను విద్యాభ్యాసము కావించిరి. 1858 వ సంవత్సరమున నుపవీతులైన పిమ్మట వారాంగ్ల విద్యాభ్యాసమునకై బందరు పురమున కరిగిరి. ఆ రోజులలో నచ్చట హిందువులను క్రైస్తవమతమునకు మార్చుయత్నములు విరివిగా సాగుచుండుటచే తల్లిదండ్రులు భీతులైవారిని స్వల్పకాలమునకే అల్లూరుకుఁ బిలిపించిరి. దానితో నింగ్లీషు చదువంతరించెను. వారు స్వయముగనే యింటి యొద్దనుండి సంస్కృతాంధ్రముల నభ్యసించుచుండిరి, వారికి బందరులో నుండినప్పుడే కవితా కుతూహల మంకురించెను. 'జయజయ సోమలింగ' అను కీర్తనను వారప్పుడే రచించిరి. 14 వ ఏట వారు 'సాత్రాజితీవిలాసమను' యక్షగానమును చక్కని శైలిలో వ్రాసియుండిరి. 1859 వ సంవత్సరము మార్చి 25వ తేదీన వారికి పెద్దమేనమామగారైన కూరాడ లక్ష్మీనరసింహంగారి రెండవ కుమార్తెయయిన జానకమ్మగారితో వివాహము జరిగెను.

1865వ సంవత్సరమున శ్రీరాములుగారు తల్లిదండ్రులతోఁగాని మఱెవ్వరితోఁగాని చెప్పకుండనే సంస్కృతము నభ్యసించుటకై ఆకిరిపల్లి కరిగిరి. అప్పు డాకిరిపల్లి సర్వశాస్త్రనిష్ణాతులైన పండితుల కాకరమై యొప్పుచుండెను. శ్రీరాములుగాను పది మాసముల పాటచ్చట వ్యాకరణ శాస్త్రము నభ్యసించుచు యితర శాస్త్రములతో గూడ బరిచయము సంపాదించిరి.

అప్పుడు వారు నూజివీటి జమీందారుగారి వలన దినమున కెనిమిదణాలవంతున విద్యార్థి వేతనము పొందఁ జాలిరి. తరువాత వారల్లూరు తిరిగివచ్చి స్వయముగా సంస్కృతభాష నభ్యసించుచు నష్టావధానము నభ్యాసము చేసిరి. ఆ కాలమున నవధానవిద్యలో నారితేరి అభినయ పండితరాయ బిరుదాంకితులై యుండిన శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులవారు శ్రీరాములుగారి మేధాసంపద కలరి 'పన్నెండేడులనాఁడె సత్కవిత చెప్పనేర్చె' నిత్యాదిగా వారినొక పద్యములో ప్రశంసించి యుండిరి. విక్టోరియారాణి స్వర్ణోత్సవ సందర్భమున వారితోపాటు శ్రీరాములుగారుకూడ పద్యములు రచించి యుండిరి.

1867వ సంవత్సరమున శ్రీరాములుగారికి ప్రథమ పుత్రులైన కేశవరావుగారు జన్మించిరి. తరువాత సుమారైదేండ్లకు అల్లూరు గ్రామము విడిచినఁగాని తమ విద్యాయశోవృద్ధికవకాశముండదని యెంచి వారు మిత్రుల ప్రోత్సాహమున గుడివాద

కరుదెంచి, యచ్చటి ఉన్నత పాఠశాలలో నాంధ్రోపాధ్యాయులుగా ప్రవేశించిరి. సుప్రసిద్ధ న్యాయవాదులును మేధావులు నైన రెంటాల వేంకటసుబ్బారావుగారప్పుడు వారికి శిష్యులైరి. అప్పటినుండియు శ్రీరాములుగారాంగ్ల భాషాజ్ఞానము నభివృద్ధి చేసికొన నారంభించిరి, 1875వ సంవత్సరమున వారు కవుతరము గ్రామమునందలి పెద్దల అభ్యర్థనపై అచ్చటి పాఠశాల కుపాధ్యాయులుగా నరిగి యచ్చట నొక సంవత్సరము పనిచేసిరి. ఈ సమయముననే వారు 'వేదాచల మాహాత్మ్యము', 'కృష్ణార్జున సమరము' అను కావ్యములను సంస్కృత జటిలమైన ప్రౌఢశైలిలో రచించి యుండిరి. తరువాత వారు దోకిపఱ్ఱు నందలి సంపన్నులైన కమ్మవారి ఆహ్వానమున నచ్చటి కరిగి యొక పాఠశాల స్థాపించి దానిని 1878 సంవత్సరము వఱకు నిర్వహించిరి. ఈ కాలముననే వారు తెలుగు ఇంగ్లీషు జనరల్ టెస్టులను పరీక్షలందును, తెలుగులో ప్లీడరు పరీక్షయందును నుత్తీర్ణులైరి. ఈ సమయముననే వారు 'సంవరణోపాఖ్యానము' అను కావ్యమును, 'లక్షణావిలాస' మను యక్షగానమును రచించిరి. 'బోయియై పల్లకీల్మోయఁగా మోయఁగా కాయలెక్కిన భుజాగ్గలుగువాఁడు' ఇత్యాదిగా లక్షణావిలాసమందు రజకుని వర్ణించు పద్యములు రమ్యముగా నుండును. దోకిపఱ్ఱులో నున్నప్పుడు శ్రీ సూరిసీతారామశాస్త్రులుగారను యువకులైన వ్యాకరణ పండితులు తమ దగ్గరకు రాగా శ్రీరాములుగారు వారియొద్ద సంస్కృత వ్యాకరణము నభ్యసించుచు వారి కాంగ్లము నేర్పి తెలుగు ప్లీడరు పరీక్షలో కృతార్థులగు నట్లొనరించిరి. 1878 వ సంవత్సరములో శ్రీరాములుగా రాగ్రామము విడిచి న్యాయవాద వృత్తి నవలంబించుటకు బందరునకరుగునప్పు డచ్చటి కమ్మవారు వారికి వెండి పూవులతో పాదపూజను, బంగారు పూలతో శిరఃపూజను గావించి, పల్లకీలో నూరేగించి, అమితమైనభక్తి ప్రకటించిరి.

1878 లో బందరు పురమున న్యాయవాదిగా ప్రవేశించి శ్రీరాములుగారు శ్రద్ధాదీక్షలతోఁ బనిచేసి అచిరకాలమునే మంచిపేరు సంపాదించిరి. అట్లు ప్లీడరుగా పనిచేయుచునే వారు సాహిత్యమునందును శాస్త్రాభ్యాసము నందును కృషిసల్పుచుండిరి. తరువాత ఇంగ్లీషు సివిలు, క్రిమినల్ హయ్యరు పరీక్షలందు కృతార్థులై ఇంగ్లీషు ప్లీడరు కాఁగల్గిరి, వారే పరీక్షకు చదివినను సులభముగా విషయమును జ్ఞాపకముంచుకొనుటకై వానిని పద్యరూపమున వ్రాసికొనుచుండిరి. ఈసమయముననే 'అనల్పజల్పితాకల్పవల్లి' యను నొక మత సాంఘిక మాసపత్రికను కొన్ని నాళ్లు నిర్వహించియుండిరి. అప్పుడప్పుడు వారచ్చట డిప్యూటీ కలెక్టరుగా నుండిన పి . టి . రాఘవాచార్యులుగారితోఁగలసి కూచిపూడి భాగవతులచే భాగవత కాలక్షేపము లేర్పాటు చేయుచుండిరి. బందరులో నున్నప్పుడే వారు మోటుపల్లి రాఘవయ్యగారు మున్నగు వారి ప్రేరణమున 'అభినవ గద్యప్రబంధము' అను విచిత్ర కల్పనా కథను ప్రౌఢశైలిలో రచించిరి. 1884వ సంవత్సరమున ఫస్టుగ్రేడు ప్లీడరీ పరీక్షకు చదివి యందు కృతార్థులైరి.

ఆ సంవత్సరములో జులైలో నంతకుముందు కడలూరులో నుండిన సబుకోర్టును ఏలూరునకు మార్చిరి. శ్రీరాములుగా రచ్చటి పరిస్థితులు మిక్కిలి అనుకూలముగా నుండుటచే బందరునుండి ఏలూరున కరిగి 1895 వఱకును సబుకోర్టులో న్యాయవాదిగా పనిచేయుచు నఖండమైన కీర్తిని, అపారమైన ధనమును సంపాదించిరి. అప్పుడు పలువురు జమీందారులును, సంపన్నులును, వారికి క్లయింటులుగా నుండిరి. ఎంతపని యొత్తిడియున్నను వారెట్లో తీరికచేసికొని రచనా వ్యాసంగము సాగించుచునే యుండిరి. వారు తోట్లవల్లూరులోని వేణుగోపాలస్వామి కంకితముగా పెక్కుకృతులు, పదములు, జావళీలు రచించియుండిరి. ఆ ప్రాంతపు వారకాంతలు  అప్పుడు వాటిని తఱచుగా పాడుచుండిరి.

ఖండ్రిక సీతారామవరమను గ్రామమును క్షత్రియులకు చెందఁజేయుటకై శ్రీరాములుగారు పాపమ్మారావు జమీందారుగారు మున్నగు వారిమీఁద వేసిన వ్యాజ్యము వారి ధైర్యసాహసములకు తార్కాణము. అందులో వారు

జయమునుబొంది గ్రామమును వశము చేసికొనిరి. ఏలూరు వచ్చిన తరువాత న్యాయవాదవృత్తిలో తీరికలేని కారణమున వారు రచనలుచేయుట కవకాశము లేకపోయెను. కాని అప్పుడప్పుడు కొన్ని పద్యములు, జావళీలు, కృతులు, పదములు మాత్రము వ్రాయుచుండిరి. ఈ కాలమున ననేక విద్యలందును, శాస్త్రములందును పండితులైనవారెందఱో వారిని దర్శించి వారి సత్కారమును పొంది యుండిరి. వారు తమ వృత్తి కావశ్యకమగుటచేతను. ఇతర కారణములచేతను ధర్మశాస్త్రమునుగూడ కూలంకషముగా పఠించిరి. గుంటూరు భానుమూర్తి గారిని వైదిక సంఘము బహిష్కరించినప్పుడు శ్రీరాములుగారు వారికి ప్రాయశ్చిత్తము చేయించి పునీతుల నొనరించిన వృత్తాంతము వారి ధర్మపరాయణతకును, ధైర్యమునకును నిదర్శనము. ఈ సందర్భమున వైదికులు లౌకికులయిండ్లకు వచ్చుట ఆపివేసినప్పుడు శ్రీరాములుగారు ధైర్యమువహించి శ్రీఅవ్వాజగన్నాథశాస్త్రిగారను నియోగి పండితుని నేలూరునకు పిలిపించి నిత్యనైమిత్తికములు యథావిధిగా జరిపించుటయే కాక 'పతితసంసర్గ ప్రాయశ్చిత్త విషయకోపన్యాస' మును రెండు రాత్రులలో రచించి విరోధుల వాదముల నన్నిటిని ఖండించిరి. ఈ సమయముననే వారు 'ఆచార నిరుక్తి', 'దురాచార భంజని' అను రెండు ధర్మశాస్త్రసంబంధ వ్యాసములు రచించి ప్రచురించిరి. తరువాత వారావ్యాసముల కన్యుల నామములతో వ్యాఖ్యానములు కూడ వెలయించిరి. ఇట్లే వైశ్యులకు కర్మలను వేదోక్తముగా నాచరించు నర్హత యున్నదా లేదా యను విషయమున వైదికులు లేదని వాదింప శ్రీరాములుగారు వ్యతిరేక పక్షము నవలంబించి యొక స్వాములవారితో వాదించి వారి నూరువిడిచి పోవునట్లొరించుటయేకాక ధర్మశాస్త్రమును హైకోర్టు తీర్పులను క్రోడీకరించి 'వైశ్యధర్మదీపిక' యను పెద్ద గ్రంథమును, 'శ్రాద్ధసంశయ విచ్ఛేదిని' యను వ్యాసమును రచించిరి.

శ్రీరాములుగారు 1890 ప్రాంతమున సంస్కృతమునుండి "జానకీ పరిణయము" అను నాటకము నాంధ్రీకరించుటయేకాక 'మనోలక్ష్మీవిలాసము' అను నొక స్వతంత్ర నాటకమును గూడ రచించి వానిని ప్రదర్శింపఁజేసిరి. వారి ఇంట విద్యాగోష్ఠులు, సంగీత సభలు నిత్యము జరుగుచునే యుండెను. వారికి భరతనాట్య శాస్త్రముతోఁగూడ పరిచయముకలదు. అందుకు వారు రచించిన 'అభినయదర్పణము' అను నాట్యశాస్త్రగ్రంథము నిదర్శనము. సిద్ధాంతము నెఱుంగుటయే కాక వారు స్వయముగా ముద్రాదులను పట్టి చూపించుచుండెడివారు. వారి ముందభినయ విద్యావిశారదలైన వేశ్యలుకూడ నభినయించుటకు జంకెడివారు. తిరుపతి వేంకటకవులు, ఆదిభట్ల నారాయణదాసుగారు మున్నగు వారెందఱో వారియింట నాతిథ్యము స్వీకరించి వారివలన సమ్మానము లొంది యుండిరి. వారు సంగీత ప్రియులగుటచే నేలూరులో నొక సంగీత పాఠశాలనుగూడ నెలకొల్పియుండిరి. వారు తమ కడగొట్టు సంతానమైన శారదాంబకు సంగీత సాహిత్యములు రెండును నేర్పించి ఆరోజులలో స్త్రీలకు సహితము విద్యాభ్యాస మవసరమేయని నిరూపించియుండిరి. అట్లే, వారేలూరులో సమర్థుఁడైన యొక యుపాధ్యాయునికి జరిగిన అన్యాయమునుగూర్చి విని వారికి జీవనోపాధి కల్పించుటకై యొక మాధ్యమిక పాఠశాలను స్థాపించి యైదారేండ్లు దానిని సమర్థతతో నిర్వహించిరి.

ఈ విధముగా శ్రీరాములుపంతులుగారు వృత్తిచే న్యాయవాదులయ్యు నాదర్శోపాధ్యాయులై, సంస్కృతాంధ్రములందు గొప్ప పండితులును, కవులునై, లలితకళోపాసకులై, విద్వత్పోషకులై, సంఘసంస్కారులై 62 ఏండ్లు వైభవోపేతమును పరోపకార పరాయణమునైన జీవితము గడపి యుత్తమ సంతానము బడసి 1908 వ సంవత్సరమున కీర్తిశేషులైరి. వారొకవంక న్యాయవాద వృత్తికిని, వేఱొకవంక సాహితీసంగీతాభినయాదులకును ఆరోజులలో అపార గౌరవము నాపాదించిన మహనీయులు.

శ్రీ శ్రీరామకవీంద్రులు రచించిన కొన్ని గ్రంథములు సందర్భవశమున పైని పేర్కొనఁబడినవి. అవిగాక వారు 'సోమలింగశతకము', 'రఘునాథశతకము', 'పంచనృసింహక్షేత్ర మాహాత్మ్యము', 'సారసంగ్రహగణితము', 'అభినవకౌముది',

సంస్కృతమున 'కామాక్షీ శతకము', 'చక్కట్లదండ' యను నచ్చతెనుఁగు శతకము, 'తర్కకౌముది', 'విగ్రహారాధన తారావళి' 'సూర్యశతకము', 'చిలుకలకొలికిశతకము', 'ముద్దులగుమ్మశతకము', 'సీతాకల్యాణ నాటకము', 'నమస్కారవిధి దీపిక', శాకుంతల, ముద్రారాక్షస, మహావీర చరిత్ర, మాలతీమాధవోత్తర రామచరిత్ర, రత్నావళీ, మంజరీ మధుకరీయ నాటకానువాదములు, 'కురంగగౌరీశంకర' నాటిక అను గ్రంథములను గూడ రచించిరి. వారు 'తెలుఁగునాడు' అను పేర నాంధ్రదేశమునందలి సర్వవర్ణముల వారిని వర్ణించుచు రచించిన 'ఆంధ్రవీధి' శ్రీనాధుని క్రీడాభిరామమును బోలి యత్యంత హృద్యముగా నుండును. అది దురదృష్ట వశమున సంపూర్ణమయి యుండలేదు. కీ. శే. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులుగారు శ్రీరాములుగారికి శ్రీనాధునితోఁగల పోలికలను వివరించుచు నొక చక్కని వ్యాసము వ్రాసియున్నారు, వారి పద్యములు కొన్ని శాస్త్రులుగారు కూడ ధారణపట్టి యుండుటయే వారి కవితా కౌశలమునకు తార్కాణము.

శ్రీరామ కవీంద్రుల రచనలకెల్ల తలమానికముగా చెప్పఁదగినది శ్రీ దేవీభాగవతాంధ్రీకరణము. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులుగారు దానికి దీర్ఘమైన పీఠిక వ్రాయుచు నందలి కవితా విశేషములను ప్రశంసించియుండిరి. వారి యనునాదము మూలాతివిధేయమును అతి స్వతంత్రమును గాక యెడనెడ స్వకపోల కల్పితములైన పద్యములతోఁగూడి హృద్యముగా నుండును. వారి రచన రసానుగుణమై, జాతీయపద ప్రచురమై, నిర్దుష్టమై, ధారాశుద్ధి శోభితమై, యింపు నింపుచుండు. దేవీమాహాత్మ్యమును బ్రశంసించు భాగములను వారనువదించిన విధానము వారి పాండిత్య పాటవమును, మంత్రశాస్త్ర ప్రావీణ్యమును సూచించును. వారి గ్రంథములు పెక్కు ముద్రితములైనను ఇప్పుడెచ్చటను లభ్యములగుటలేదు. వారి వంశమునకుఁజెందిన పెద్దలును, యువకులును వారి గ్రంథముల నన్నిటిని సేకరించి, మరల ముద్రించి సారస్వత సేవాపరాయణుల కానందము నావహింతురని యాశించుచున్నాను.

---

*హైదరాబాదులోని శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయములో 8 డిశంబరు 1973న చిత్రపట ఆవిష్కరణము సందర్భంగా వ్రాసిన ప్రసంగ వ్యాసము*

# విషయసూచిక



## కృతులు

**తత్వప్రతిపాదిక కృతి**



## పదములు

## జావళీలు

## తిల్లానా



## మంగళహారతులు



## దరువు



## స్వర రచన

| | | | |
|---|---|---|---|
| **కృతులు** | : | | శ్రీ నూకల చిన్నసత్యనారాయణ గారు |
| **పదములు** | : | 1–13 & 23 | శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు గారు |
| | | 14–22 | శ్రీ వోలేటి వేంకటేశ్వర్లు గారు |
| **జావళీలు** | : | 1,5–10, 15, 16, 18 | శ్రీ వోలేటి వేంకటేశ్వర్లు గారు |
| | | 2–4, 11–14, 17, 19–24 | శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు గారు |



ఏలూరులో ఫస్ట్ గ్రేడ్ ప్లీడరుగా

**దాసు శ్రీరాములు గారు**

ఏప్రిల్ 8, 1846 - మే 16, 1908

# స్వరజతులు

## 1. సామి యది గజగామనిరా

### కళ్యాణి - ఆది

ప ॥ సా , ని ద ప ప ని ద మ ద మ మా గ రి । స రి స పా మ ద ప । స ని ద ప మ ప ద ని ॥

సా . మి య ది గ జ గా . మి ని రా త గు । స ర సు దం చు ని ను । స ర స కు పి లి చె ర ॥ ॥ సామి ॥

చ 1 ॥ స రి గ రీ స ని స రి సా ని దా ని స । రి సా ని ద ప ద ద । పా , మ గ మ ప ద ॥

స రి గ నీ వు మ ద న మూ ర్తి వౌ దు వు । చ కో ర న య న న । టిం చు ర తి గ తి ॥ ॥ సామి ॥

చ 2 ॥ స రీ గ ప మ ద ప ని దా ప మ ప ద ని । స రీ స ని ద ప మ । ద పా మ గ మ ద ని ॥

వి రా ళి బ డి త ర త రా ల వి ద మె ద । స రా లు క ను గొ న । వ రా లు గు రి యు ర ॥ ॥ సామి ॥

చ 3 ॥ స రీ గ గ రి రి స ని సా రి రి స స ని । ద నీ స స ని ని ద । ద పా మ ప ద ని స ॥

భ ళీ భ ళి ర ర స ద ళీ ర ము ల కు ను । గ ణా ధ రు ని రు చి । ద ళా న కె ద గ ళ ॥

రి గా రి స రీ స ని సా ని ద నీ ద । సా గ రి స రీ నీ రి సా ని దా ని ॥

వ లించి చ లించి వె లంది మె లంగె । వా ట ము గ నీ బో టి తో టి కూట ॥

ద ప ని ద ప మ ప గ మ ప గా మ ప ద మ । , ప ద ని పా ద ని । , స రీ స ని ద ని ॥

మి క నీ . కే . టి కి ప ని సా టి గ ను పా । . టి గ ను సూ టి గా । . ను మే టి గా . ను ॥ ॥ సామి ॥

చ 4 ॥ సా రి గ రీ స స నీ స రి సా ని ని । దా ని స నీ ద ప । మ గ మ ని దా ; ॥

ని క్క ము గా న ది చ క్క ని చి న్న ది । ద క్కి తి న న్న ది । ద య గ న రా . ॥

స రి గ మ ప ద ప ని దా : . రి గ మ । ప ద ని దా : . । గ మ ప ద ని దా . ॥
ని ర త న ద య వి హి తా . . ర త న । య వి హి తా . . । త న య వి హి తా . ॥

; మ ప ద ని దా : . ప ద ని దా । ; . ద ని దా . । : ని దా ; . ॥
. న య వి హి తా . . య వి హి తా । . . వి హి తా . । . హి తా . . ॥

దా సా రీ స రి స ని సా పా దా । ని ద ప మ పా సా । రీ సా రి రి స ని ॥
తా దా మోద ర క వి తా దా స్వ । స్వ య జ ని తా సు । శ్రీ రా మ ను తా . ॥ ॥ సామి ॥

## 2. కోపమటరా నాపైని

### బిలహరి – చాపు

పల్లవి ॥ గా ప ద రి సా ॥ ని దా పా మ గ ॥ రీ గ సా గ రి ॥ స ని ద స రి గ ప ॥
కో ప మ ట రా ॥ నా . పై . ని ॥ సా మి గా త గు ॥ త గు ర స రి కొ ద ॥

ద రి స ని ద ప ద ॥ మ గ స రి గ స రి ॥
మ చ ను గ వ న ది ॥ మె ద ర స రి స రి ॥ ॥ కోప ॥

చ1. స రి గా గ గా ॥ రి గ పా ప పా ॥ గ ప దా ద దా ॥ ద ప సా స సా ॥
త డ బా టు న ॥ నొ ద బా టు న ॥ క డు నీ టు న ॥ జ డ వే టు న ॥

గ రి స ని ద ప మ ॥ గ రి స రి గ స రి ॥
తొ డ ల తొ డ లి డి ॥ వ డి బొ డు తు స రి ॥ ॥ కోప ॥

చ2. సా మ గ రి సా ॥ రి గ ప రీ గ ప ॥ మ గ రి గ ప దా ॥ గా ద ప మ గా ॥
పు ప్వి లు తు పో ॥ రి ది రా న వ్వుల ॥ కు వే . ళ గు రా ॥ ద వ్వుల కు బో ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| | ప ద సా సా రి ॥ | రి స రి స ని ద ప ॥ | పా ద ని ద ప ద ॥ | | |
| | **కు మురా నీ వి ॥** | **ముడి వ ది లె ను ర ॥** | **నీ ప ని యిక ను ॥** | | |
| | ప మ గ రి గ మ గ ॥ | రి స రి గ రి స ॥ | | | |
| | **గ న రా మో. వి గ ॥** | **ర తు ర స ర స ॥** | | | ॥ కోప ॥ |
| చ3. | ద ప ని ద వ స ని ॥ | ద ప గ ప మ గ రి ॥ | స రి స ని ద పా ॥ | గ రి స రి గ ప మ ॥ | |
| | **ని ను నె ద ను వ ద ॥** | **ల ను రా న ను గె లి ॥** | **చి ప ద గ ద రా ॥** | **వి ను వి ను ము మ న ॥** | |
| | గ రి గ పా ప ద ॥ | గ ప ద ని ద ప ద ॥ | సా గ రి సా ని ॥ | రి స నీ ద స ని ॥ | |
| | **వ ల ర ఆ ప ను ॥** | **ల కు ను ఘ ను ద వు ॥** | **రా ఘ న దా సు ॥** | **కు ల రా మ క వి ॥** | |
| | దా ప ని ద పా ॥ | మ గ రి స రి స ని ॥ | ద స రి స రి గ రి ॥ | | |
| | **ప్రే మ ద ని యిం ॥** | **పు మి క ద య ద ల ॥** | **చి న రి బి ల హా రి ॥** | | ॥కోపమటరా॥ |

## 3. సామిరారా సమయమురా

### కాంభోజి – ఆది

| | | | | |
|---|---|---|---|---|
| పల్లవి ॥ | సా , ని దా పా మాగా పా దా । | సా రి స నీ ద ప । | మ గ ప ద స ని ప ద ॥ | |
| | **సా . మి రా రా స మ య ము ।** | **రా జ ల జా క్షి గ ।** | **వ య ని క ప్రే మ తో . ॥** | |
| చ 1. | రి సా ని ద ప ద ని ద ప ద మ గ ప ద స । | రి గ స నీ ద ప ద । | ని ద ప మ గ మ ప ద ॥ | |
| | **స రో జ ము ల ను రో . జ ము ల మ ద ను డు ।** | **గు రి య గ రా ఇ క ।** | **ప రా . కు వ ల దు ర ॥** | ॥ సామి ॥ |
| | | | ప ద ని ద పా , మ | |
| చ 2. | దా ని ద ప ద ప మా ప ద ని ద ప మా । | ద ని ద ద ప మా ప । | ద ని ద ప మా ప ద ॥ | |
| | **నా మ న వి వి ను మా ద య ను గ ను మా ।** | **: వ ని త న ను మా న ।** | **ము వ ద లి యా వ ల ॥** | |

ద స రి రి ప ద ద ని ద ప ద స స రీ గ రి । సా ని ద ద పా మ । మ గ ప ద నీ ద ని ॥
న వ ల కు వ ల యా . క్షి జె ద రె ర కో కి ల । కూక ల కు కే కు । ల కే . క నీ మ ధు ॥

ద ప ద పా ప మ గ మ ప మాగ రి గ స । స రి సా , రి గ మ । ప ద సా రి గ రి గ ॥
ర వ చ నా మృత ముచె వి నా ని న ది . । మ ద నా . ర్తి బ దె । న . ది ని క్క ముచ ॥

మ గ మాప మ పా ద ప పా ద ని దా । మాప ద పా గా । మ ప మ గ గ మ ప ద ॥
క్క ని చు క్క ర మ క్కువ జి క్కె ను గా । చొ క్క ము గా నొ । క్క టి గ సొ క్కించుమి క ॥ ॥ సామి ॥

చ 3. సా ని ని ద ద స గ రి స ని ద పా; । రి గ మ ప ద ని ద ప । ధ్ర రి గ మ ద పా , ॥
దా పు న మ న యు ప వ న ము న లే . । ద లి రు ల ల రా . రు । పొ ద గ ల దు రా . ॥

గ మ ప దా మ ప ద ని ద ద ని ద ప మ గ । రీ , గ మ సా రి । గా ; మ ప దా ॥
వ ల దు రా చ ల ము రా . గ ద ర బ లు ప . । సం. దు గ ల ప । సం. బొ ద ల ॥
మ పా ద ని ద ప ద ని దా ద ప మ ప ద । ద పా ప మ ద రి ద । స స రి గ మ ప ద రి ॥
బి రా న వ ర హి మ క రా న న ను మ రు । దు రా న ద ను ప గ । ద రా రి పు ద ను జ వి ॥
సా ని ద స నీ ప దా ని దా ప మా దపా మ గా రీ । గ మాప దా; ॥
రా మ దా సు రా మ దా స రై ముదా ది దా యకా మే । ఘ సా య కా . ॥ ॥ సామి ॥

## 4. సామియేమిరా సరసాన

### శంకరాభరణం – చాపు

పల్లవి ॥ సా రి గా , మ పా మ గ । గా మ గ రి స ని । స ని ద ప మ ద ద । ప ప మ గ రి స ని ॥
సా మి యే . మి రా స ర । సా న క లి గి తే । స ద న ము న మ ద । ను ని క ద న గ తి ॥ ॥ సామి ॥

చ 1. పా మ గా రి స । దా ప మా రి ద । పా ద మ గ గ ని । స ని స రి స ని ద ।
మోము మోమున । జే ర్చి బా ళి చె । ముద్దు జె . ట్ట గ । ముదు రు ముదు రు గ ।
స ని ద ప మ గ రి ॥
వి స రి క స రి తి ॥ ॥ సామి ॥

చ 2. సా మ గ మ రి గ । సా రి గ గా రి । స స రీ ప మ గ । గ మ రీ గ మ గ ।
ని క్కుచ ను గ వ । నీ యెద నా టిం । చి న నొ క్క వ ల । ద ని నో టి కి దో ।
, మ గ రి గా ద । ప ద మ ప మా , । ప ద ప దా ప మ ॥ ప ద ని సా గా ॥
. చి న ట్టు యెక్క । డి స వ తి యే . । మ ని బో ధించె ర ॥ యిక స రే ఔ ॥
రి స ని ద ప రీ ॥ స ని ద ప మ దా ॥ పా మ గ రి స ని ॥
భ ళి భ ళి ర నీ ॥ ప ని దె లి సె యే ॥ రా ద యగ న ర ॥ ॥ సామి ॥

చ 3. పా మ పా మ గ ॥ మా గ మా గ రి ॥ గా రి గా రి స ॥ నీ రి పా ; ॥
నీ సు ధా ధ ర ॥ మాన బూని న ॥ నే డు గా ద న ॥ న్యాయ మా. ॥
<u>పా పా మ గ మా మా గ రి గా</u> ॥ <u>రి స నీ రీ నీ రీ నీ రీ</u> ॥ సా , ; ; ॥ గ మ పా ద ని స ।
వ్యాసా వ క గో పా ల క రూ ॥ ప క ఔ రా ఔ రా ఔ రా ॥ రా . . . ॥ నీ . కె త గు ర ।
రీ స నీ ద ప ॥ మ దా ప మా గ ॥ రి స పా ; మ । గా ; రి స ని ॥
వా సి మీ ర గ ॥ సు దా సు రా మ ॥ క వి దా . సి । యే . లు మి క ॥ ॥ సామి ॥

# వినాయక కృతులు

## విఘ్నేశ్వర స్తుతి

## 1. వామనరూపా వందనము

### హిందుస్థానీ కాపీ - అట (మిశ్రచాపు)

పల్లవి ॥ వామనరూపా వందనము వందనము ॥ వామన ॥

అ.ప ॥ స్వామి గణప్రదీపా చారుతర ప్రతాపా ॥ వామన ॥

చ 1. విక్కిన బొజ్జగుంట విద్యలకెల్లదంట
ముక్కంటి కడుపు పంట ముఖ్యుడవీవన్నింట ॥ వామన ॥

చ 2. కుదుములు మెక్కి కొక్కు గుఱ్ఱముమీద నెక్కు
నొడయడ నీవే దిక్కు గొడవల నడగ ద్రొక్కు ॥ వామన ॥

చ 3. దాసకులాభిరామ భాసుర శ్రీరామదాసుని
బ్రోవు ప్రేమ దైవకుల లలామ ॥ వామన ॥

### హిందుస్థానీ కాపీ - ఆట (మిశ్రచాపు)

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పల్లవి ॥ | ప వీ మ పా | । | మ గ ప మ గా రీ | ॥ | స రి ప మ గ రి | ॥ | స ని నీ స్రా ; | ॥ | |
| | వా . మ న | । | రూ . . . ప . | ॥ | వం . . . . . | ॥ | ద . న ము. | ॥ | ॥వామన॥ |
| అ॥ | రీ , మ పా | । | పా నీ మా పా | ॥ | గ మా ని పా | । | రి గ స రి మా పా | ॥ | |
| | స్వా. మి గ | । | ణ ప్ర దీ ప | ॥ | చా . రు త | । | ర . ప్ర . తా పా | ॥ | ॥వామన॥ |
| చ 1. | ప నీ మ పా | । | నీ నీ సా సా | ॥ | ప గా రి గా | । | సా రీ గ రి స ని సా | ॥ | |
| | వి . క్కి న | । | బొ జ్జ గుం ట | ॥ | వి . ద్య ల | । | కె ల్ల . . దం. ట | ॥ | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | స మా గ మా | । | రి మ గ రి స ని సా ॥ | దా ద ని రి స | । | ని ప మ గ రి స రి మ ॥ | |
| | ము. క్కం టి | । | క దు పు . పం. ట ॥ | ము ఖ్యు . డ . | । | వీ . వ . న్నిం . . ట ॥ | ॥వామన॥ |
| చ 3. | ప నీ మ పా | । | నీ నీ సా సా | । ప గా రి గా | । | సా రీ గ రి స ని సా ॥ | |
| | దా . సు కు | । | లా భి రా మ | । భా . సు ర | । | శ్రీ రా . . . . మ ॥ | |
| | స మాగ మా | । | రి మ గ రి స ని సా । | దా ద ని రి స | । | ని ప మ గ రి స రి మ ॥ | |
| | దా . సు ని | । | బ్రో . వు . ప్రే . మ । | దై . వ కు ల | । | ల . లా . మ . . . ॥ | ॥వామన॥ |

## 2. గణాధిపతిమీళేహం శ్రీగణాధిపతిమీళే

### సురటి - ఆది

పల్లవి ॥ గణాధిపతి మీళే హం శ్రీ గణాధిపతిమీళే ॥ గణాధి ॥

అ.ప ॥ గుణగణ ఫణనా గణిత మహంశ్రీ ॥ గణాధి ॥

చ 1. వాగీశాద్యాస్సుమన సోనశం సర్వార్థా
నాముపక్రమేయంన త్వా కృతకృత్యా స్స్యస్తం ॥ గణాధి ॥

చ 2. శుక్లాంబరధర మనఘం విష్ణుం శశధర వర్ణం
చతుర్భుజం ప్రసన్నవదనం భంజిత మదనం ॥ గణాధి ॥

చ 3. యంబ్రహ్మాణ్యావదంతి పరమంచాన్యే
విశ్వోత్పత్తికారణం తం దాసుశ్రీరామపోషకం ॥ గణాధి ॥

### సురటి - ఆది

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| పల్లవి ॥ | సా , నీ , దా పా మామ గ ప మ | । | రీ ; ; మ గ | । | రి స రి మ ప ని ద ని ॥ | |
| | గ . ణా . ధి ప తి మీ . . . | । | ళే . . హం . | । | . . శ్రీ . . . . . . ॥ | ॥గణాధి॥ |

అ.ప ॥ ; రి మాప నీ దా నీ సా ; । సా , ని దా ని ద । ప మ గ రి రి మ ప ని ॥
. గు ణ గ ణ ఫ ణ నా . । గ . ణి త మ . । హం . . . శ్రీ . . . ॥ ॥గణాధి॥

చ 1. ; మా, మా, మ గ రీ రీ సా । రీ మాపా పా । ని ద ని స ని ద పా ॥
. వా . గీ . శా . . . ద్య । స్సుమ న సో । . . న . శం . . ॥

; రీ మాపా ప ని దా నీ సా । సా , నీ , దా । పా ; ; ; ॥
. స ర్వార్థా . . . . నా । ము. ప . క్ర । మే . . . ॥

; రీ మా పా పా నీ సా రీ । ; రి మ గ సా, । స స ని ద పా ; ॥
. యం . న . త్వా . . । . కృ . . . . । త . . . . . ॥

; సా ; ; స స ని ద పా ; । ; మ గ రీ సా । రి మ వ ని ద ని సా ॥
. కృ . . త్యా . . . . . । . స్స్యు . . . । స్తం. . . . . . . ॥ ॥గణాధి॥

చ 3. ; మా , మా, మ గ రీ రీ సా । రీ మా ; పా ని స ని ద పా ; ॥
. యం . బ్ర . హ్మా . . ణ్యా . । వ దం . తి ప . ర . మం . ॥

; రి మా ప నీ ని దా ని సా ; । సా ; నీ ని ద సా ని ద పా ; ॥
. చా . న్యే . వి . . శ్వో . । త్ప . త్తి కా . . ర . ణం. ॥

; సా సా సా నీ , ద పా ; । మ గ రి మ రీ సా రి మ ప ని ద ని సా ॥
. తం. దా సు . . శ్రీ . । రా . . . మ . పో . . . ష . కం ॥ ॥గణాధి॥

# 3. జయజయ విఘ్ననాయక

## నాట - ఆది

పల్లవి ॥ జయజయ విఘ్ననాయకా జయజయ శుభఫలదాయకా ॥ జయ ॥

చ 1. జయ జయ  జయ జయ జయ సురపోషక
జయ జయ సనకాదియమి సమిథికా భయకర కారుణికా
నయయుత జయ జనకా ప్రియమృదువాక్పటుకా విలసదాఖుహయకా ॥ జయ ॥

చ 2. జయ జయ శంభు కుమారకా జయజయ దోషనివారకా
జయ జయ జయ జయ జయ సుఖ కారక
జయ జయ కనకాచల సమతనుకా జయసురకులతిలకా
శయహిత కృతిశతకా శయధృత సుమకలికా సత్పణి కరకటకా ॥ జయ ॥

చ 3. జయ జయ భక్త జనావనా జయ జయ సిద్ధి గజాననా
జయ జయ జయ జయ జయ విద్యాధన జయ జిత మదనా
జయ గుణసదనా జయ జయ సిత వసనా
జయ జయయుత కదనా నియమిత మధుమథనా నిర్మలతర రదనా ॥ జయ ॥

చ 4. జయ జయ కీర్తివిరాజితా జయ జయ ధృతివిభ్రాజితా
జయ జయ జయ జయ జయ సురపూజిత
జయ ముని జనతా శ్రయపద ఘనతా జయవరదాసుయుతా
న్వయకవిరామనుతా జయ భంజితవినుతా జయ జగదవనరతా ॥ జయ ॥

*

## నాట - ఆది

పల్లవి ॥ ; స నీ ప మామ గ ప మ గ మ రీ । సా స రి గా మా । పా ; , మ గ మ । ప ని ॥ స నీ ప మా।

. జ య జ య వి . . . . . . । ఘ్ననా . . య । కా . . . . . . । . . ॥ జ య జ య।

అ.ప॥ ; గ మాప పా పా స ని ప మ పా । ; స ని పా నీ సా ; । ; గ మ । ప ని ॥

. జ య జ య శు భ . ఫ . ల । . దా . . య కా . । . జ య । జ య ॥

చ 1. ; గ మా ప మా మ గ ప మ గ మ రి స । సా ని సా గ మా । పా , మ నీ పా ।

. జ య జ య జ . య. జ . య. । . జ య సు ర । పో . . ష క ।

; గ మాప ని ప పా నీ సా ; । సా స ని పా మా । మ గ ప మ రీ సా ।

. జ య జ య. స న కా . । ది య . మి న । మి . థి . కా . ।

సా గ మారి సా ; గ మా ప మా । నీ పా పా మా । గా మాపా పా ।

అ భ య క ర . కా . రు ణీ । కా . న య । యు త జ య ।

; ప నీ సా , సా నీ పా మా । ప స స ని పా గ మ । ప నీ ప ని స రీ । ; స నీ ప మా॥

. జ న కా . ప్రి య మ్మృ దు । వా . కృ టు కా వి ల । స దా ఖు హ య కా । . జ య జ య॥ ॥ జయ॥

– తక్కిన చరణములు చరణము వలె –

